## అంకితము

"రోజులుమారాయి" లే జానపదముల
ఏర్వాకపాటతో ఇంపుమీర
డప్పులవాద్యాల దండోరలయలోన
తెలుగుజాతీయత వెల్లివిరిసె
"తోడికోడళ్ళు"గా తోబుట్టువులవలె
రచనకు సరియైన బాణీగూర్చి
కష్టజీవుల శ్రమ కలిసిమెలిసినపని
ఆడుతూపాడితే అలుపుసొలసె

వేణుగానలోలు మురళిస్వరాళి
వేయిరకముల నీలోన విస్తరిల్లె
వేణుసార్థకనామ యివ్వేళగొనుమ
అంకితమ్ము **గీతావళి** కృతిని సుమతి

ప్రఖ్యాత సినిమా సంగీత దర్శకుడు

**శ్రీ వేణు గారికి**

# పరిచయం

శ్రీ రోహిణీకుమార్ "గీతావళి" పాటలపుస్తకమునకు పరిచయవాక్యములను వ్రాయుటకు సంతోషిస్తున్నాను. నాకు సంగీతములో గల అనుభవమును పురస్కరించుకొని, వ్రేళ్ళమీద లెక్కపెట్టతగు పాటలపుస్తకములు ప్రచారములో నున్నప్పటికిన్ని, ఈ 'గీతావళి'లోగల రకరకాల రచనా పోకడలు నన్ను ఎంతో ఉత్సాహితులాగించినవి.

పదిమందికి వినిపించాలనే ఉత్సాహముతో రసిక లోకం ఆదరిస్తుందనే గాఢవిశ్వాసముతో నడుంకట్టి ముందుకు వచ్చిన రచయిత ధైర్యసాహసాలను మెచ్చుకుంటే అతిశయోక్తి కానేరదు.

మన ప్రాచీన సంగీత సాంప్రదాయమగు కర్నాటక బాణిలో పాడుకొనుటకు కొన్ని వుపయోగించును. హిందూస్థానములో ప్రచారములో నున్న మీరాభజన్ కీర్తనలకు పోలినవి కొన్ని గలవు. జానపదములు, జావళీలు, రేడియోగీతాలు, భావకవితలు మరికొన్ని గలవు.

ఏ విధముగ పాడుకొన్నను, ఏ బాణిలో పాడినను గాయకులకు, శ్రోతలకు పరవశత్వము కలిగించగలవని నా నమ్మకము.

మ్యూజికల్ హాల్
విజయవాడ – 2.

ఎన్. లక్ష్మణరావు,
వైణికులు.

# ముందు మాట

ఈకవితా ప్రసూన
సుందరాంగి వాణీ
కరాంగుళీ వీణా
తంత్రీ విన్యాస జనిత
చల్లని వాలు జాలు చూపు
ఈ చిన్న పుస్తకమందు నాయందు
ఆదరాభిమానులకొొసకు
ఇదికొద్ది ప్రియమైన కానుక
మీ మది కదిలించే మరువని మేనక

ఈ గీతావళి పుస్తకము మీ చేతుల్లో ఉంచటానికి దాదాపు అజ్ఞాతంగా పదిసంవత్సరాల స్వయంకృషిని నేను జ్ఞాపకం చేసుకోవాలి. 1948 నుండి 58 వరకు అడపాతడపా చేసిన రచనలే యివి.

లలితపదాలతో, అతి తేలికగా, సులువుగా పాడుకోటానికి సులభంగా వ్రాయాలనే తలంపు నన్ను ప్రేరేపించి, వ్రాయించింది. నాకు తెలిసినవరకు తెలుగు నుడులను ప్రయోగించాననే అనుకుంటున్నాను. ప్రతిగీతంలో శ్రోతలను ఆనందింపచెయ్యటమే ప్రధానాంశముగా ఎన్నుకొనబడింది.

ఎంతటి ధనవంతుడైన, దానగుణం లేనిది రాణించనట్లు ఎంతబాగా వ్రాశేవాడైనా పాడుకునే గాయకుడు లేనిది ఆ పాట జీవించనేరదు. అందుకే సంగీతసాహిత్యాలు అవినా

భావసంబంధములుగ ఒకదానిపై ఒకటి ఆధారపడి రెండున్నూ జీవిస్తాయి. మన పెద్ద లన్నట్లు సంగీతసాహిత్యాలు రెండున్నూ సరస్వతీదేవి పయోధరాలు. లలితకళల్లో ఈ రెండు అమృత భాండాల తియ్యదనం ఆస్వాదించడం రసాపిపాసులకే వదలి వేద్దాము.

పాటల రచనలోను, లలిత సంగీత కూర్పులోను అక్షరముల సద్దుబాటుచేసి చక్కని శ్రావ్యమైన బాణిలో అన్నిటిని బీరుపోకుండా కూర్చిన గాయకసోదరుడు సుబ్బారావుకు ఆశీస్సులు.

ఉత్సాహవంతులు ప్రోత్సాహ కుశలులు, అడిగిన దే తడవుగా సకాలములో చేయూతనిచ్చి, పరిచయ వాక్యాలు వ్రాసి యిచ్చిన శ్రీ లక్ష్మణరావుగారికి ప్రత్యేక అభివందనాలు.

కళానైపుణ్యముతో ముఖచిత్రంగీసిన 'చిత్రకార్' గారికి, ఆకర్షణీయముగా ముద్రించిన మంజరిప్రెస్ యజమానులకు నా అభివందనాలు.

విజయవాడ, మీ

1 ఆగస్టు 1958 రోహిణీకుమార్

# వి న తి

తెలుగుసాహిత్యములో వివిధస్వరూపాలను ప్రచురించాలని, ప్రచారము చేయాలన్న ముఖ్యాశయముతో ఈ పబ్లికేషన్సు సంస్థను నిర్మించటము జరిగింది.

గేయాలు, గీతాలు, కథలు, కథానికలు, నాటికలు, నాటకములు, సాహిత్యవిమర్శలు, సినిమా సాంకేతికవిజ్ఞాన పుస్తకములు ప్రచురించాలని సంపాదకవర్గమును ఏర్పాటు చేసితిమి.

రచయితలు, పాఠకులు చేయూతనిస్తారని ఆశిస్తున్నాము. మా ఉద్యమాన్ని ప్రోత్సహిస్తారని ఆకాంక్షిస్తున్నాము. రచయితలకు లాభాలలో సగము పంచిపెట్టబడును.

ప్రకాశకులు,

పోలంరాజు పబ్లికేషన్సు.

## శ్రీ వి నా య క...

శ్రీ వినాయక ఓ వినాయక
సర్వకార్య విఘ్ననాయక

ఆరంభించెద ఏ కార్యమైన
తొలిగానిన్ను తలపున తలచి
మూషికవాహన ఓ బొజ్జగణపతి
కార్యసమాప్తికి అందుకో వినతి
ఆలించినామొర పాలించవేలర
ఓ వినాయక విఘ్ననాయక

పార్వతిచేతి పిండిబొమ్మవు
పరమేశ్వరుని ప్రాణప్రదుడవు
కరివదన ఓ అమరగణన
కరముల మోడ్చి మ్రొక్కెదను
ఆలించి నామొర పాలించవేలర
ఓ వినాయక విఘ్ననాయక

## అమ్మా భారతి....

అమ్మా భారతి ఇమ్మా సరస్వతి
కొల్లలుదీవెనలు చల్లనిచూపులతో

తలవాకిట నిలచి తలపులలో కలిసి
కలమునకరమున నాట్యముసల్పవే
సొంపగుసొబగున ఇంపగునుడుల
నవనవోదయ భావభంగిమల

లలితకళల అధిదేవతవు
సకలవిద్యల పట్టపురాణివి
ఊహాపోహాల ఉదయించి కదలించి
వెల్లివిరియ వేల భావతరంగాల

జ య జ య...

జయ జయ భారత జనని
జయ జయ ప్రియతమ అవని

అంబరచుంబిత నగరాజ శిఖరీ
కన్యకుమారి పారాణి చరణీ
శీతలపశ్చిమ తీర ధరాతలి
కాళిక కేళీ వంగదేశపుడమి

పావనగంగ శ్యామలయమున
గౌతమికృష్ణ కావేరి పెన్న
జీవజలాలు నదీనదాలు
సస్యసంపదల ధామణిరమణి

ఆంధ్ర కర్నాట తమిళ మరాట
హిందీ కాశ్మీరి ఉరుదు బెంగాలి
దేశభాషల పుట్టిన యిల్లు
బహువిధవేష మనోజ్ఞ సుందరి

## శ్రీ కల్యాణి...

శ్రీకల్యాణీ శర్వాణి
శ్రితపోషిణి శివరాణి

కరుణను బ్రోవవే కమలలోచని
అరమరలేలనే అభయదాయిని

వారణాసీ విలసితే
అన్నపూర్ణ నామాంకితే
విశ్వనాథ సహావసితే
విశ్వంభరా నిబిడీకృతే

మధురాపురి శుభనిలయే
మందహాస మధుర వీక్ష ణే
దక్షిణాపథ పరిపాలితే
రక్షితమాం మీనాక్షి ణే

## ఓ తల్లి....

ఓ తల్లి నాతల్లి కామేశ్వరి
జాబిల్లి సిగపూళి ప్రాణేశ్వరి

మాయింట వెలసిన మహాలక్ష్మివమ్మ
మా చంటిపాపల కాపాడుమమ్మ
ముక్కంటికి గడుసరి ముద్దులగుమ్మ
ఆమింటనంటిన హిమగిరి సుతవమ్మ

శ్రీకంఠుజనరాల మాకీవె వరముల
మా వెంటనీడవయి చల్లగ చూడుమ
వెన్నంటితోడువయి భయముదీర్చుమ
నీకంటె నూపుమాకు ఆకొన్న ప్రాపుసుమి

## శ్రీ వేంకటేశ...

శ్రీ వేంకటేశ శేషగిరీశ
వేంకటరమణ సంకటహరణ

అలివేలుమంగ పాలితాంతరంగ
పద్మావతిప్రియ సర్వకార్యక్రియ

ఏడుకొండలవాడ ముడుపుమాటలవాడ
తిరుపతి నిలయుండ తెలుగుల రేడ

మ్రొక్కినభక్తుల దిక్కైనవాడ
గ్రక్కునబ్రోవర గరుడవాహనుడ

చిక్కెను నామది నీయందె
మ్రొక్కితిరాప్రభు భువియందె

## జ య ర ఘు రా మ...

జయజయ రఘురామ శ్రీరామ
జయజయ రవికులసోమ

తారకనామా సీతారామా
పాలిత నిజజన పట్టాభిరామ

తాపసియాగ రక్షకరామ
జనకసుతా కళ్యాణరామ

తండ్రియాన తలదాల్చినరామ
ఖండితాసురవర వీరాధిరామ

న్యాయపాలనా వృద్ధామ
మానవలోక పూజితరామ

## స త్య మై న...

సత్యమైన నారాయణస్వామి
ఆశ్రితులను కాపాడవ దేమి

జగతి సృజించిన పితామహుండవు
లోకరక్షణకు పురుషోత్తముడవు
లయమును చేసెడి కాలరుద్రుడవు
మూడులోకముల దేవదేవుడవు

జీవశక్తిని వెల్గునిచ్చెడి దినకరుండవు
వెన్నెల కురిపించె కుముదప్రియుడవు
ఋతువులత్రిప్పెడి కాలరూపుడవు
నమ్మినవారికి ప్రియబాంధవుండవు

## గి రి ధ ర...

గిరిధర గిరిధర దరియగరావో
మురహర మురహర మురియగరావో

రసిక జనాళి విరాళి మురళి
రాసలీలా క్రీడావినోదా

మధుమాసము అరుదెంచెనే
మధువునింపి వికసించెనే
తెలికన్నుల తెలుపువలపుల
ప్రేమబాసల చెలిపిలుపు విని

పలవించె మదన శరంబుల
విలపించె మధుర భావముల
అలసిసొలసె రాధావనిత
కలవరించెనే వ్యధితముదిత

# పిల్లనగ్రోవి...

పిల్లనగ్రోవి పాటగాని
నెమలిపింఛం కనుపించెనటే
అల్లరి గోపమ్మసుతుని
వేణుగానం వినిపించెనటే

మందయాన యీ బృందావని
సుందరుడే గోవిందుడు
మందార పొదరింట్లలో
గుబివెందల సందిళ్లలో
నెమలిపింఛెం కనుపించెనటె
వేణుగానం వినిపించెనటె

మధురకుపోవు మానినులార
సమాగమన సంకేతగమనుడే
రాధామానస నిలయుండే
మాధవదేవుని మన్మధరూపుని
నెమలిపింఛం కనుపించెనటె
వేణుగానం వినిపించెనటే

# ఎ ం దు దా గి నా వో...

ఎందుదాగినావో ఓ మురళి
బృందావనినిండె నీ రవళి

మాధవిలతల మాటునో
గున్నమావి గుబురులోనో
పొగడతరుల నీడలనో
పొన్నచెట్టు తల్పమునో ॥

గోకులమందునో
గోవర్ధనగిరి క్రిందనో
గోపమ్మ గోశాలనో
రాధమ్మ కౌగిళ్లనో ॥

## ఓ ము ర ళీ...

ఓ మురళీ
గోపబాలుని మోవి
రాగసుధను గ్రోలి
నీ వెంతధన్యవైతివే
ఓ మురళీ

బృందావన వనిలో
జమునా సైకత సీమలలో
ఏకాంత నిశాంతములో
శ్రీకాంతునితో మంతనాలాడిన
నీ వెంతధన్యవైతివే
ఓ మురళీ...

రాధిక వ్యధితమానస
మధుర ప్రణయ సంభావనలో
మాధవదేవు మదిలో మెదిలే
గాధల గుసగుసలువిన్న
నీ వెంతధన్యవైతివే
ఓ మురళీ

## సందెచీకటి...

సందెచీకటి వచ్చెనే
చందురుడు నింగిపై వచ్చెనే
అరవింద నయనుడు
నందుని కొమరుడు

రాడేలనో సఖియా
జాగేలనో చెలియా

నవ్వెనది నల్లని జమున
కవ్వించినది మలయపవనము
చెక్కిలినొక్కి పూలబాల గేలిచేసె
మక్కువమమత ఎక్కువాయెనే

రాడేలనో సఖియా
జాగేలనో చెలియా

మధురానగరీ బాటలోన
తేనెలొలుకు మాటలోన
మధురాలనింపి మాలతిపందిరికి
ఒంటిగ పరుకంటపడక రమ్మని

రాడేలనో సఖియా
జాగేలనో చెలియా

## ర తి ప తి····

రతిపతిమిన్న అతివరోకన్న
మదనమోహనుని
సదయహృదయుని
కన్నారా వెన్నుని
విన్నారా మురళిని

మిసమిస వెన్న మ్రింగువాడే
ముసిముసి నగవులు నవ్వువాడే
వ్రజవనితా మానసహారుడే
నవరసభరిత నటశేఖరుడే
కన్నారా వెన్నుని
విన్నారా మురళిని

బృందావని విహారుడే
రాధికమానస చోరుడే
రాసలీలా వినోదుడే
మధురభక్తి సులభలభ్యుడే
కన్నారా వెన్నుని
విన్నారా మురళిని

## విన్నాడటే...

విన్నాడటే చెలీ విన్నపము
వెన్నుడు వనమాలి ప్రసన్నుడై

వయసులోన మనసులోన
వలపులోన పలవించినరీతి
దయయుంచి మనసుంచి
ప్రసన్నుడై వెన్నుడు
విన్నాడటే చెలీ విన్నపము

యమునాతటిలోన
నీలాటిరేవులోన
నల్లగాతి చరియపైన
కలియగ రమ్మన్న సంకేతము
కనికరించి మనసుంచి
ప్రసన్నుడై వెన్నుడు
విన్నాడటే చెలీ విన్నపము

## మ ధు ర గా య కా...

మధురగాయకా ఆలపించరా
మధురానాధుని గాథాలహరి

వ్యథిత రాధా మానసమే
నీ రాగసుధకు కథాసంధానం
మర్మములేని నిర్మలప్రేమకు
కలకాలమునిల్చిన నిదర్శనం
ఎన్నడువినలేదు, ఎన్నడుకనలేదు

సాయం సమయం యమునాసైకతం
బృందావనిలో నందగోపాలుడు
గోపికావృతుడై రాసక్రీడలో
మధురప్రణయ అధరాలమధువు
సోనలపానము వానలతనిసిన
మధురానాధుని గాథాలహరి

పూలనావలో...

పూలనావలో అలలయమునలో
శారద రాత్రిలో నీరద గాత్రుడు
అలిగిన రాధిక అలకతీర్చెనే

గలగల పలికెను కలికి యమున
కిలకిల నవ్వె రాకేందువదన
మరిమరి పలుమరు కోసరెను నారి
కులుకుల చెక్కిలినొక్కె మురారి
అలిగినరాధిక అలకతీర్చెనే
పూలనావలో అలలయమునలో

జాగాయె మగువరో మన్నించు నేరము
జనని యశోద పాలివ్వ తడవాయె
మూతిముడిచిన అవనతముఖివైన
విలువైనకాలము వెడలునే రమణి
అలిగిన రాధిక అలుకతీర్చెనే
పూలనావలో అలలయమునలో

క వి త...

కలత చెందినదా నీ మది హారి
వలపు వొలికించెనా ధూర్త నారి

వ్రజవనిత మదిజనిత
ప్రణయ భరిత కామపీడిత
అతులిత మాధుర్యామృత
చలిత కూజితమా చరిత

వ్రాసితివా పాపాణి
రాధిక లేత చరణి
వేసితె ఓరిమితో నీల వేణి
పులిమితే పెదవిపైరంగు బాలతరణి
విసరెనా మాలతిమాల కుపితగమని
కనులబడ నలిమితే పరాగరేణు శ్రేణి

## అదిగో...

అదిగో అల్లన పిల్లనగోవి
మెల్లగ సవ్వడి వినిపించె – వినిపించె

బృందావని పూవులబాటల
యమున కెరటాల నావహోలికల
విహారింపగ సరితోడు రమ్మని
మురళీధరుని సంకేతము

పున్నమి వెన్నెల పొన్నలనీడల
రసమంజులశ్రీ రాసక్రీడకు
మధురానగరి మార్గమందలి
నీటిచరియ దరిదాపునకు
విహారింపగ సరితోడు రమ్మని
మురళీధరుని సంకేతము

## పా ద ప మా...

పాదపమా సరిగ
మాధవు గురితించి శే
నీ నీడలో మోడిసేయు
ఆ వేళలో

నీ సరిగరిమ సరి
తూగ రెవ్వరు భువిలో
ధన్యజీవివి నీవేగ

మరిమరి నీ పద
సేవను సల్పెద
తరువుజాతి సార్థకమే

## పట్టపగటి వేళ...

పట్టపగటి వేళ
నట్టనడివీధి
పట్టుకురా కొంగు
ముద్దుగోపాలా

గొల్ల పెద్దలు చూచిరేని
పసుపుదక్కడు బ్రతుకనీరు
మాపటి వేళకు
మల్లెపందిరి క్రింద
మసక చీకటిలోన
మరువకు కలియగ మదనగోపాలా

మనసు నీపైన మరులుకొన్నాదిరా
ఈడువారలు చూడ
వాడవాడల పొక్కిపోవు
మాపటి వేళకు
మల్లెపందిరి క్రింద
మసక చీకటిలోన
మరువకు కలియగ మదనగోపాలా

## గి రి ధ ర...

గిరిధర రావుగా
బిరబిర పరుగిడి
నవనీతచోరా
పరుగిడిరావుగా

నందగోపాల మురళీలోల
బృందారకవంద్య హరిగోవింద
అందాలరాధిక సుందరప్రేమిక
కుందరదన నిన్ను కోరికోరి పిలచినా

యమునలో వనితల వలువలు హరించి
నీవునేననే భ్రాంతిని తొలగించి బోధించి
రసమంజుల రాసలీలలో తేలించి మురిపించిన

## కసురు....

కసురుకున్నావేలనే నాసామీ
విసురుగా వేంచేసెనే

ముసిముసి నగవుల
ముస్తాబయి నేను ఎంతో
కుసుమ శరంబుల
క్రుంగిన ననుచూచి

కాటుకకన్నుల కైపెక్కి నామనసు
మాటిమాటికి వాని మదిలో తలపించి
కోటిమదనరూపు కొఱకు వేచి వేచి
సాటిలేనివారి సరసకు నేనేగ

# అందమైన...

అందమైన చందమామా
పందెమేల వలపు నీమ
మందారసుందరీ మరంద నింపుకొని
సందెచీకటిలో రా సుందరాంగభృంగకా

పువ్వుల విలుకాని నవ్వుల విరిసిరులు
కవ్వించి ఉడికించు మధుమాసమాధవుడు

పరిమళము మోయు మలయపవనుడు
పంచమశృతిలోన కోయిలమ్మ ప్రేమగీతం

నెమలి నెలత నీటయిన గుమ్మ నాట్యం
శారదకాల నీరద లయ భంగిమలు

## కా ద న కో యి...

కాదనకోయి కాదనకోయి

కన్నెవలపున కలిగిన తలపున
ఎన్నికచేసి నిన్నే కోరిన
కాదనకోయి కాదనకోయి

ఒంటరిపాటున నీకైన సొగసున
మక్కువ మనసున శీతలరాత్రిలో
వెన్నెల వెలుగున జంటకుకోరిన
కాదనకోయి కాదనకోయి

వృత్తినైజానికి ఋతుధర్మానికి
కానుకకోరిన వేషాలు వేయకు
పతితల పరువును వెలగట్టబోకు
కాదనకోయి కాదనకోయి

## ఎ గా ది గా....

ఎగాదిగా నావంక కోరికోరి చూస్తావేమి
కోనారి కొంటెబాన కంటికి యింపైన గుంటనా

కాటుకకన్నుల్లో బుగ్గపైచుక్కల్లో
నాసటి తిలకములో చిరునవ్వు పెదవిలో
ఏమేమి కోరతావు ఎందుకలా చూస్తావు

కులుకు పలుకుల్లో బెదరిన చూపుల్లో
గాజుల గలగలలో అందెల రవళిలో
ఏమేమి కోరతావు ఎందుకలా చూస్తావు

వయ్యారం నడకల్లో సింగారం చేతల్లో
తీపికలలు కన్నుల్లో అనుభూతికై వేట ఎదలో
ఏమేమి కోరతావు ఎందుకలా చూస్తావు

నా మనసిచ్చా...

నా మనసిచ్చా నీకు
మామయ్యా మంచి మామయ్యా

అతికోమలము
ప్రేమపూరితము
నీకే కైవశము
లాలించి పాలించవోయ్

నా సౌందర్యము యవ్వనపొంగు
కవ్వించె వయసు కన్నెవలపు
తియ్యని కోర్కెలు తీరనికలలు
లాలించి పాలించవోయ్

కమ్మనిపాటలు తియ్యనిమాటలు
మదిలో మమతలు చక్కిలిగింతలు
మమతల ఊయల ఓర్వలేనులే
లాలించి పాలించవోయ్

## చల్లనివెన్నెల...

చల్లని వెన్నెల జాబిలి
యవ్వన హోయల కోమలి

ఏకాంతానా నిశాంతాన
నిన్నే కోరె మనసార

రంగులపువ్వుల పరిమళము
సింగారి నవ్వుల పరువము
కవ్వించే వసంతుడు నవ్వించే శ్రీమంతుడు
నిన్నే కోరే మనసార మన్నించరాదొర

హృదయవిపంచిని మీటరా
మునిగోరుల మెయి తాకరా
సిగ్గులనిగ్గులు బుగ్గలచేరి
గోముగ ముద్దుల నీయరా
నిన్నే కోరె మనసార మన్నించరా దొర

## రావో...

రావో
నినుబాసి చనలేనో
నామనోహరా

నాలో నామనసు నీకై నసమున
నన్ను వదిలి నీవు కదిలి
వీడిపోనున్నావా విడిచిపోతున్నావా
నా మనోహరా రావో

పగలు రేయి దాటిపోయి
నీనగుమోము కనుమరుగైన
శూన్యదృక్కుల గగనము చూచేదా
కాటుకచారికల నీకై వేచేదా

ఓ ర సి క....

ఓరసికా నా ప్రేమిక
రారమ్మిక నాయేలిక

కమ్మగపాడి మైమరపించనా
తియ్యగమాటాడి నిన్నూరించనా
కవ్వించి ఆటల నవ్వుల్లో ముంచనా

మనసులు హాయిగా మనము తేలగా
కానరాని చోటులకు దూరదూర తీరాలకు
పోవుదమా, జంటగా ఎగురుదమా జంటగా

నీవునేను కూడికలిసి తేడా లేక జోడుగాను
కోరిక సుఖాలనే అమరముచేసి
జగతిలో వెతలను మరచిపోదమా సఖా

కలువ...

కలువకన్నెనురా వలచినారా
కరుణించరా ఓ చేదోరా

నీపయి విరాళి ఓపలేనురా
అధరాలకలిపి మధురాలనింపరా
కరుణించరా ఓ చేదోరా

నామెయి వంపుల కేలున తాకరా
నాకలోకసుఖాలు నీ వలిబంధాలు
కరుణించరా ఓ చేదోరా

నీవే నేనయి నేనే నీనయి
రతికాములమై కేళిలీల తేలుదాం
కరుణించరా ఓ చేదోరా

## ఆ పా ట...

ఆపాటపాడకే
ఆపివేయవే ఓపలేను
గున్నమావి కొమ్మపైన
కూరుచున్న కోయిలమ్మ

నాసామి నేనొకటయి
ఏకాంత సెజ్జపయి
నిశాంతమందులోన
చంద్రుడు చూచినవ్వ
ఆపాట పాడితివి
వలపువలను విసరితివి

చెట్టాపట్టాల్ బట్టి
చుక్కల వెల్గు తోరణాల
ఆపూల బాటలో
చెలునితో నే నడువ
ఆపాట పాడితివి
వలపువలను విసరితివి

ఓ మ యూ రి...

ఓ మయూరిసడకల వయ్యారి
మెల్లంగరావే నా దరికి

అరుణ అధరాల అరుణిమ ననుపిలచె
కాటుకకన్నుల కోరచూపు కవ్వించె
చిలిపినవ్వులు తియ్యనికలలై కలచె

నీ సిగపువ్వుల మువ్వన
పరువము ననుముందుకు త్రోసెనే

నహొరే వయ్యారి
ఓహో మయూరి
ఆహా సింగారి
మెల్లంగ రావే నాదరికి

## రా వే ల నే...

రావేలనే కోమలి
ఏలనే చెలీ నీ ఎదలోని
ఆ వేదన తెలుప వేలనే

రాకాచంద్రుడు
కలువకన్నె దరి చేరిపోయెనే

మలయపవనుడు
తేలిపోలి పరిమళం మందగించెనే
కోయిలమ్మ పాడిపాడి
అలసి సొలసి గొంతు మూగపోయెనే

మదిలో ఏదో ఆరాటము
మెదిలే భావ పోరాటము
కలికి ఏల చెప్పటము

# రా కా చం ద్రు డు...

రాకాచంద్రుడు రాడాయెనేడు
ఆకాశమంత ఎదురుచూచిన

తారకకోరిక మరిమరి వేగమే
నల్లమబ్బు నన్ను వెళ్ళనియ్యదే

వెన్నెల వెలుగులు వెదజల్లువానలు
కన్నెవలపులు శ్రావణమేఘాలు

మబ్బులలోన మెరిసే మెరుపువే
మనసున మక్కువ మగువ చెప్పదు

మగవారిమాటలు నీటిమూటలు
శుద్ధబూటకాలు పచ్చి మోసాలు

పెదవివిప్పితే కదనరంగము
నవ్వీన పువ్వుల వాసనపరువము

నగుమోము చూపవో సఖా
నగుమోము చూపవే సఖి

## చి న్నా రి రూ ప...

చిన్నారిరూప
కన్నారిపాప
చూపనా ఉయ్యాల
పాడనా జంపాల

నీలాల కన్నికలు
మూసేరు కన్నులు
దోచేరు వన్నెలు
నిమిషింప వేల ముగ్ధబాల

నీ బోసినవ్వులు
పూసిన పువ్వులు
రాలిన రత్నాలు
పలికినముత్యాలు

ఆనందముద్ర
అందాలనిద్ర
ఊగవే హాయిగ
తూగెనే మాయగ

## వి న్నా వా....

విన్నావాయునక విన్నావాయుచెలి
సుందరజగతి శృంగారమంతా
మిన్నేపిలచెనే మిన్నేవలచెనే
తాజమహాల్ నిర్మాణములో
ప్రణయచరిత పరికించితే
మొగల్ పాదుషా ప్రేమేకదా
ప్రేయసిపైన అనురాగమే

ఇసుక రేణువుల జీవసమాధి
ఎడారితుఫానుల విజృంభణాలో
ప్రేమగాథల ప్రియమైనదిగా
ప్రపంచమంతా లైలాస్మరణే

మధువుపానము అధరపానము
మధురానుభూతియే వరునకుముఖ్యం
ఉమర్ ప్రేమికుని రుబాయత్ లో
విశ్వకవితలో గుభాళించినది

## బోసినోరు...

బోసినోరు విప్పినవ్వే
చిట్టితల్లి జాబిల్లి
అరవిరసిన సుమసమమై
అందాల నెరవై
ముదమెంతో మదిపొంగ

ఈతిబాధలన్ని మరచి
బ్రతుకుపైన ఆశనించి
నందననవసీమనుండి
బృందారక సీమంతిని
చిరునవ్వుల చిందువేయ
ప్రతిరూపై మారిపోవ

రతనాలు రాలెనే
ముత్యాలు కురిసెనే
ఏ దేవి వరబలమో
మా సుకృతి సఫలమో
వెలలేని సిరిపంట
మా యింట నిండెనే

## చిట్టి బాబు...

చిట్టిబాబు రారా
చిన్నబాబు రారా
కన్నతండ్రి ఒక్కముద్దు
కన్నుల తృప్తి నిండెరా

నీ బోసి నగవులు
విరిసిన సుమములు
సంతాపమతులకు
సంతోషసాగరము
నా వరాలమూట
నా బంగరుకొండ

పడబోయే తప్పటడుగు
వడివడిగ నడచే పరుగు
నడికష్టాల గుండె బరువుకు
దారిచూపే రేయి వెలుగు
నా వరాలమూట
నా బంగరుకొండ

న వ్య క ళా....

నవ్యకళాపిపాసి
భవ్యభారతీ ఉపాసి

భావకవి హృదయస్పందన
భావావేశ ఉదయారవింద
రమణీయ రమ్య
ఊహాసుందరీ ఉపాసీ – పిపాసీ

సంగీత సాగరావిర్భవ
సప్తస్వర నాదామృత
లయ సమ్మేళన తంత్రీజనిత
గానసరస్వతీ ఉపాసీ – పిపాసీ

చిత్రకారుని కుంచియ
విచిత్రరీతి కదలికల
మనోరంజిత వంపుసొంపుల
కురంగనయనీ ఉపాసీ – పిపాసీ

హావభావ అంగప్రకటిత
అభిసారికా వేషిణీ
కీరసారికా భాషిణీ
నాట్యమయూరీ ఉపాసీ – పిపాసీ